# పీఠిక

శ్రీ

కవిశిరోమణులారా!!

కం॥ పొత్తము రచింప నాకిది
క్రొత్త యగుటఁ దప్పులింకఁ • గొల్లలు గాఁగన్
జిత్తమునఁ గోపముంచక
నిత్తరి నాదోషముల క్ష • మింపుడు దయతోన్॥

ది 10-6-13.
పెదకూత్తేవి.

ఇట్లు విన్నవించు సుధీవిధేయురాలు,
లింగమనేని నాగభూషణమాంబ.

శ్రీ

కృష్ణపరబ్రహ్మణేనమః



# మానసబోధతారావళి



## కందములు.

శ్రీధరుఁ డరవిందాక్షుఁడు
సాధుజనావనుఁడుఁ దలఁప ♦ సకలంబునకున్
ఆధారభూతుఁడయిన గ
దాధరు ననయంబుభక్తిఁ ♦ దలఁచుము మనసా॥ 1

భక్తవరదుఁ డను పేరిట
రక్తిమహిన్ వెలఁగు నింది ♦ రా రమణుని నా
శక్తి మెయిన్ బ్రార్థించిన
ముక్తిం బొందెదవు సుకర ♦ ముగ నో మనసా॥ 2

కామాద్యరిషడ్వర్గము
చే మహిలో బాధపడుచుఁ ♦ జెల్లరే, జనులా
వేమారు నెత్తనేటికి?
దామోదరుఁ గొలువు మింక ♦ తడయక మనసా॥ 3

ఎప్పటికైనను జీవము
దప్పక నీబొందివిడిచి ♦ తరలుట నిక్కం
బిప్పలుకుఁ దెలిసినిత్యము
నప్పరమాత్ముని భజింపు ♦ మనువుగ మనసా॥ 4

సిరు లమితముగాఁగలవని
గరువము నొందకుము వల్ల ♦ కాటికిఁ జనుచో
నరుదెంచునె? మన యీసిరు
లరయ సుకృతదుష్కృతములె ♦ యనుగును మనసా॥

యాగంబు లొనర్చిన, హాట
యోగంబు లొనర్చినను బ్ర ♦ యోజనమున్నే?
భోగిశయానుని పదముల
బాగుగ నీయుందుఁగుమరు ♦ పరపక మనసా॥ 6

సారవిహీనంబగు నం
సారాంభోనిధి మునింగి ♦ సతము నణుగులా

ధారుణిఁ బొందగ నేటికి?
సారెకు శ్రీరమణుసేవ • సలుపుము మనసా॥ 7

దేహమునఁ గల్గుభ్రాంతిచె
మోహమదాదులను విడక•మూఢత నెపుడే
ద్రోహమునన్ దగలకుము ను
మా, హరిపదచింతనమున • నలగుము మనసా॥ 8

మనవిని విని యనవరతం
బును నిశ్చలతన్ వహించి • మురదైత్యునిఁ ద్రుం
చిన మేటిఁ గొల్చుటయె సా
ధనమపవర్గమున కనుచుఁ • దలఁపవె మనసా॥ 9

వేగిని లేచినది మొదలు
నోగిది జాగిది యటంచు • నుల్లము నందున్
బాగుగఁ బరిశీలింపుచు
నాగోవిందునిభజింపు • మర్మిలిమనసా॥ 10

అర్మిలిభక్తుల కిల్బిష
కర్మవిమోచనమొనర్చు•కంజదళాక్షున్
నిర్మలతఁ జేరు టుత్తమ
ధర్మమగుట మెలఁగు మటులఁ • దప్పక మనసా॥ 11

వగనైన భీతినైనను
బగనైన మత్తెట్టులైనఁ • బల్కినఁజాలుఁ
ఖగవాహనాఖ్యనామము
సుగతినిఁ బొందంగఁజేయు • సులువుగ మనసా॥ 12

కలిమియు లేమియు రెండును
నిలఁ గావడికుండలనుచు • నెఱిఁగి సిరులతోఁ
దులతూగునపుడు నలరుచు
నలలేమినిఁ బొందునప్డు • డఱవకు మనసా। 13

నెమ్మిఁగొలుచు భక్తజన భ
వమ్ము లవమ్ముగనొనర్చి • వరము లొసగెదం
చిమ్మహి బిరుదు వహించిన
యమ్మధుసూదనునిఁగొల్వు • మనయము మనసా॥ 14

గుర్వగునధికారము నా
కుర్విఁగల్గినదటంచు • నొకతఱినైనన్
గర్వమున విఱ్ఱవీగక
పర్వసముని చింతనంబె • సలుపుము మనసా। 15

చోరులయినఁ జారులయిన
వారిజసంభవ భవాది • భర్గార్యమ్ముఖులే

ధీరుని(గొల్చెదరా ల
క్ష్మీరమణుని నమ్మికొల్వ • మేలగు మనసా॥ 16

కరిరాజవరప్రదు సన
వరతము భజియింతువేని • బహుదుస్తరమా
పరమార్థము సులభమ్మగ
దొరకును, దుఃఖంబు లెల్ల • దొల(గును మనసా॥ 17

సూచినిమోపుటకు వరసి
చూచిన రవ్వంతయేని( • జోటులినువకన్
దోచు పరిపూర్ణు(డై యవ(
డా చక్రి భజించిపొందు • మమలత మనసా॥ 18

జన్మములన్నిట నుత్తమ
జన్మము నరజన్మమగుట(•జక్క(గ హరి నీ
జన్మమున భజించిన నీ(క
జన్మమునెత్త( బనిలేదు•జగతిని మనసా॥ 19

కొందరు మెండుగ సుఖముల
నొందుదురిక జక్రిమఱచి•యురుదుఃఖములన్
బొందుదురి( దల(తు రటుచే
యందగ డెపుడతనిదల(ప • న్యాయమి మనసా॥ 20

నారాయణు పదపద్మము
లారాధించిన నఘుంబు • లంటవు వారిఁ
వారిని సారసపత్రము
లారయ నంటనివిధమున • నవనిఁ మనసా॥ 21

జీవము దేహమును విడిచి
పోవుతరిఁ సర్వలోక • పూజితుఁజక్రిఁ
భావింతువా, భావింపవా
కావున నిపుడే తలంచు • కదలక మనసా॥ 22

పుట్టు తెవుళ్లనుఁ బాపెడు
దిట్టయనుచుఁ బేరునొంది•స్థిరభక్తులచే
పట్టెడు నందునిముద్దుల
పట్టినెవుడుఁ గొలువు మదియొ•భద్రము మనసా॥ 23

జీవము గల్గగనే వను
దేవకుమారుని భజించి•స్థిరపదవిఁ గనం
గావలె, నయ్యాదిబాసిన
యాతలఁ దత్పదవిఁ గనఁగ • నౌనే? మనసా॥ 24

దుష్టుల శిక్షయొనర్చుచు
శిష్టులఁ బాలనమొనర్చు • సీతానాథుఁ

దిష్టాంతమునందయినన్
దిష్టవశంబునఁ దలఁచిన ♦ దివిగ 25




ఎక్కడి తలిదండ్రులో, మఱి
యెక్కడిబాంధవులో, హితులో ♦ యెక్కడిసుతులో,
యెక్కడి ధనధాన్యములో,
యక్కట యివియెల్లకల్ల ♦ యనుకొను మనసా॥ 26

ధరణిన్గల్గు చతుర్విధ
పురుషార్థములందు నరయ ♦ మోక్షమొకటియే
పరమోత్తమంబగుట నన
వరతంబును దానిఁగోర ♦ వలయును మనసా॥ 27

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---

కం॥ పదియున్ దొమ్మిదివందల
పదమూడవసమను జూను ♦ పదియవ తేదిన్
గొదలేక ముగించి కరివ
రదునకు నర్పించితిన్ గ ♦ రంబనురక్తిన్॥

## మంగళహారతి.

"మంగళహారతి । మారశుభాంగా" అనుమాదిరిమట్టు

మంగళహారతి । రంగుగఁగొనుమా॥ పల్లవి॥

1. మురళికాభరణా । నరసిజచరణా ।
సురరిపుహరణా । ధరాధరోద్ధరణా॥ మం॥
2. దశరథబాలా । దశముఖకాలా ।
కాంచనచేలా । కామినీలోలా॥ మం॥
3. గోపకుమారా । ప్రాపునీవేరా ।
పాపవిదూరా । పావనాకారా॥ మం॥
4. మురహరబ్రోవా । నరగునరావా ।
నాగభూషమాంబ । నమ్మినదేవా॥ మం॥

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

మద్గురువర్యుండగు శ్రీ ఘంటశాల వేంకటరమణ కవిప్రణీతంబులు.

### మేలుకొలుపు - భూపాలరాగం.

తెల్లవారవచ్చెను॥ పల్లవి॥

తెల్లవారవచ్చె। నల్లనల్లనపత్తు। తెల్ల లేచికూయ
సాగెను। ఉల్లాసమునభక్తు। లెల్లవచ్చిరిగొల్వ।
నల్లనినాసామి మేలుకో। తెల్ల॥ ఉపపల్లవి॥

## చరణములు

1. కలిగెమోదముకమల। ములకెల్ల నస్త్రాద్రి। ని
లచె శశిమండలము। కలువల కెల్లది। గులుగల్గె
వెన్నెల। పులుగులు భయమందె మేలుకో॥ తెల్ల॥

2. చుక్క లంబరమున। నక్కడక్కడ దోఁచె।
మక్కె శుక్రుని తేజము। కొక్కొరొకోయని।
కుక్కుటవ్రాతము। లొక్కటఁగూసెను మేలు
కో॥ తెల్ల॥

3. మచ్ఛమై మున్నీరు। జొచ్చి సోమకుఁద్రుంచి।
చెచ్చెరఁ దొలిమిన్కులఁ। దెచ్చిపద్మజునకు।
సిచ్చినయట్టియో। సచ్చరిత్ర! వేగ మేలుకో॥ తెల్ల॥

4. సురదైత్యులబ్ధినిఁ। దరవంగమఠమై మం। దర
పర్వతము నెత్తియున్। గరుణనిర్జరుల కె। ల్లరకు
నమృతమిడిన। పరమపూరుష! వేగ, మేలుకో॥ తెల్ల॥

5. కిరివై హిరణ్యాక్షు । బరిమార్చి వేగని । ర్జరులె ల్లరును మెచ్చఁగా । నురుదంష్ట్రముల విశ్వం । భరనెత్తి వట్టి యో । పరమకృపానిధి! మేలుకో॥ తెల్ల॥

6. నరసింహరూపమై । ధర హేమకశ్యపు । నురముఁ జీరివధించియు । వరగఁబ్రహ్లాదునిఁ । గరుణతోఁ గాచిన ! నిరుపమ గుణజాల! మేలుకో॥ తెల్ల॥

7. వడుగైమ బలిదైత్యు । కడకేగి పుడమి మూ। డడుగులయాచించి నే । ర్పడర నోదసినిండి । వడిఁ బాతాళమునకు । నడఁగఁద్రొక్కిన మేటి! మే లుకో॥ తెల్ల॥

8. ఇరువది యొకమారు । ధరణిలోనున్న భూ । వరులసంగరధాత్రిని । పరశువు చేఁబూని । శిర ముల నఱికిన । పరశు రామావతార! మేలుకో॥ తెల॥

9. ఇనవంశమునఁబుట్టి । యనలాక్షువిల్లుఁద్రుంచి । జనకాత్మజకుఁబతివై । పనివడి దశకంధ । రుని మపకంబులఁ।దునిమిన శ్రీరామ! మేలుకో॥ తెల్ల॥

10. దితిసుతభామల । వ్రతభంగమొనరించి । యతి
మోదమునఁబార్వతీ । పతికిఁ బ్రపత్కమై ।
క్షితిలోపలచినబుద్ధ । శ్రితజనపాలక మేలుకో॥
తెల్ల॥

11. ధరణీభారముమాన్ప । కొఱకు వసుదేవునకు ।
పరమప్రీతిజనించియు । దురితాత్ములనుఁద్రుంచి ।
గరిమమీరగభక్త । వరులగాచినకృష్ణా! మేలు
కో॥ తెల్ల॥

12. ఇల వర్ణాశ్రమధర్మ॥ ములు లేకదురిత సం । కుల
మాం నత్తరిజూచియున్ । జలమొప్పవచ్చి భూ ।
స్థలితిరుగతద్ధర్మ॥ ముల స్థాపించెను కల్కి! మేలు
కో॥ తెల్ల॥

13. జగములఁ బాలింపఁ బగ తెల్లఁదిమగఁ గ। లిగినబడ
లికచేత నా । మగుడ మగుడఁ బ్రార్థిం । పగనైన
లేవవు । అగణితవైభవ! మేలుకో॥ తెల్ల॥

14. ధరభట్లపెనుమర్తి । పురమున వెలసియు । శరణు
జొచ్చినభక్తులన్ ౹ దురితసూన్యులఁజేసి । నరగఁ
బ్రోచెదనంచు।బిరుదుగల్గినస్వామి! మేలుకో॥ తెల్ల

15. వాలాయమును ఘంట । శాలవానుఁడు ఘంట ।
శాల వేంకటరమణయాఖ్యుని। నేలుబృందావన ।
ఖేల! భక్తపాల । జాలమేల యింతమేలుకో॥ తెల్ల॥

మంగళహారతి.

'మంగళహారతి । మారసుభాంగా' అనుమాదిరిమట్టు

మంగళహారతి । మాధవగొనుమా॥ పల్లవి॥

1. మునిజనపాల । మోహనలీల ।
సుగుణవిశాల । సురరిపుకాల॥ మం॥

2. పరమవిహార । భక్తమందార ।
నందకుమారా । నవనీతచోర॥ మం॥

3. నీరజనేత్ర । నీరదగాత్ర ।
పరమపవిత్ర । భవ్యచరిత్ర॥ మం॥

4. మణిమయభూష । మంజులభాష ।
లాలితవేష । పాలితదాస॥ మం॥

5. పంకజచరణ । భవోదధితరణ ।
వేంకటరమణ । సంకటహరణ॥ మం॥

మంగళహారతి.

మంగళంబిదె కొను । మ్యా, రమావరా॥ పల్లవి॥

1. ముచికుంద నందిత । మునిబృంద వందిత॥ మం॥

2. క్షీరాబ్ధి మందిర । జితమార సుందర॥ మం॥
3. భక్తామర ద్రుమ । భవతిమిర చంద్రమ॥ మం॥
4. వేంకటరమణ । సంకటహరణ॥ మం॥

## మంగళహారతి.

'మంగళం దయాంతరంగ । రంగనాథతే । రవికులప్రియ'

అనుమాదిరి పట్టు

మంగళం బహీంద్రశయన । సంగరహిత సా ।
రంగనయన॥ పల్లవి॥

భవతిమిరార్యమ! కృపాస్వ । భావా! సుగు ।
ణావాస!ర । మావామా । మణివిహార ॥ మంగ
ళం॥ ఉపపల్లవి॥

1. అండజరాడ్గమ! యమునకుల! మందన! యఖిలాండ
కోట్య । బాండపతి! సురారిశిరః । ఖండన!యా ।
ఖండలనుత । భండన! వే । దండవరద॥ మం॥

2. పంకజనయనా! ముకుంద । సంకటహర । ఘంట
శాల । వేంకటరమూర్చితపద । పంకజా! శంకర
నుత । శంకర భక్తవశంకర॥ మం॥

# మంగళహారతి.

రఘువీరా । రణధీర । రారా సాకేతధామవిహారీ ॥

అనుమాదిరి.

వరశీలా । సురపాలా । వరదా! హారతిగొనుమా ॥

పల్లవి॥

శరణాగతభక్తరక్ష । ధరణీసురకల్పవృక్ష॥ వర॥

గిరీశ చాపవిభంగా । కరధృతశంఖరథాంగా ।

దురితభుజగహేమాంగా । చరణగంగ మోహ

నాంగ॥ వర॥

ఘోరాసురదర్పహరణ । కుంజరదుఃఖనివారణ ।

స్వారాణ్ణుతపవిదారణ । సరశీరుహ నిభచరణ ।

సంస్మృతి శరనిధితరణా । సన్నుత సర్వాభరణా ।

భక్తహృదబ్జభ్రమణా । పాలితవేంకటరమణా ॥

వర॥

సంపూర్ణము.

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

